# నిశ్శ్రేయసానందము

విద్వత్కవిరత్న

ముత్యా సుబ్బారాయ దైవజ్ఞమణిచే

రచియింపబడి,

శ్రీ మంతెన సత్యనారాయణ రాజుగారి

(చెరుకుమిల్లి P. B. ప్రెసిడెంటు)

సంపూర్ణసహాయమున గ్రంథకర్తగారిచే ముద్రింపబడినది



1953

కమలకుటీర్ ప్రెస్,

నరసాపురం.



వెల 1-0-0

# పీఠిక.

విద్వత్కవిరత్న శ్రీ ముత్య సుబ్బారాయకవిగారి నూతనసృష్టి యగు "నిశ్శ్రేయసానందము" నాంధ్రాళికిఁ బరిచయము చేయు భాగ్యము గల్గినందులకు సంతసిల్లుచున్నాడను. రసరీతి వృత్త్యలంకారాదులచేతను కథాసంవిధానకౌశలముచేతను, భాషాపాటవము చేతను పాత్రపోషణాచాతురిచేతను, సకలజనచేతోమోదకరము, నున్నతాదర్శప్రదర్శకమునునైన యీకావ్యము కవిగారి యితర కావ్యముల సంప్రదాయము ననుసరించి, వివేకబోధకమై యలరారుచున్నది. ఈ గ్రంథమున నిస్సారమైన పద్యము మందునకైనను గానరాదు. ఏదో యొక చమత్కారమో, అలంకారమో యుత్కృష్టనీతి బోధయో మానవప్రకృతి పరిశీలనమో, బాహ్యప్రకృతి వర్ణనమో, లోకోక్తియో రచనాప్రాగల్భ్యమో లేని పద్యమిందు గన్పట్టదు. లోకోక్తులు, నీతులు, భావానుకూలభాషాగతులు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు శ్లేషలు ప్రౌఢకల్పనలు, ప్రాసపాటవము ప్రత్యేక రచనాజిహ్వానిరోష్ఠ్యము వంటి చిత్రకవిత్వములు పెక్కులిందు గన్పట్ట గలవు. భావములలితము. ధా[illegible] నిర్దుష్టమును.

ఈ కవితల్లజుని కవితాప్రావీణ్యమునకు ద్యోతకమైనది, కథాసంవిధానకౌశలము. దీనిని చదువ బ్రారంభించిన తొలుదొల్త గ్రీకురాణి యగు క్రిస్సెల్డా, నా మదికి గోచరమై పిదప మాయమైనది. ఆమెకథ వలె దుఃఖాంతముగాగాక చిక్కలి యద్భుతమగు సుఖాంతముగా నిది చిత్రింపబడినది. ప్రతిపాత్రమును తీర్చిదిద్దినయట్లుండి వివేకమును వెదజల్లుచున్నవి.

సతీపతిధర్మములు, రాజధర్మములు, సచివధర్మములు, మానవ ధర్మములు, ధర్మవిజయము మున్నగునవిందు చక్కగా వెలయింప బడినవి. ఈ గ్రంథము విద్యార్థులకు భావభాషాభివర్ధకమగుటచే పాఠ్యగ్రంథముగ సర్వవిధముల తగియున్నది. ఇద్ది విద్యార్థులకే కాక విజ్ఞానపిపాసువులకును విందొనర్చుననుట సుంతయు నతిశయోక్తి కానేరదు. చదువుకొలది యీ పాఠకులే యిందలి గుణములు గ్రహింప నేర్తురుగాన విస్తరభీతిచే నిందు వ్రాయవిరమించుచున్నాడను.

జటావల్లభుల పురుషోత్తం M. A.

ఓం

# యోగ్యతాపత్రమ్.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యయమనియమాద్యష్టాంగ యోగానుష్ఠాన నిష్ఠాగరిష్ఠ, తపస్సంపన్న, సకలనిగమాగమసారహృదయ కాండత్రయ ప్రవర్తక, భక్తకామ్యకల్పద్రుమ, సర్వతంత్రస్వతంత్ర పరమపావనీయ ద్రవిడదేశాంతర్గత చిత్రానదీతీర త్రికూటాచలక్షేత్రనివాస, శ్రీదత్తాత్రేయ మఠాధీశ శ్రీసిద్ధేశ్వర పీఠప్రతిష్ఠాపనాచార్య శ్రీమచ్ఛంకర భగవత్పాద పద్మారాధక, శ్రీమౌనానంద స్వామి పర్యాయపద విరాజమాన శ్రీశ్రీశ్రీ శివచిదానంద సరస్వతీ స్వామినామాజ్ఞానుసారేణ శ్రీసిద్ధేశ్వర పీఠాధిష్ఠితానాం అనేక భాషాకోవిదానాం శ్రీమత్పరమహంసేత్యాది సకలబిరుదావళీ విరాజమానానాం శ్రీశ్రీశ్రీ జగద్గురు విమలానంద భారతీస్వామినాం కరకమల సంజాత శ్రీకుర్తాలపీఠాధీశ్వర శ్రీశ్రీశ్రీ జగద్గురు త్రివిక్రమ రామానంద భారతీస్వామిభిః, అనేకమండల దత్తశిరోన్యాస విరాజమానైః.

పశ్చిమగోదావరీ మండలాంతర్గత శ్రీరామాపురీ వాస్తవ్యస్య శ్రీముత్యవంశదీపకస్య సుబ్బారాయశర్మణే జ్యోతిషకవిత్వ వేదాంతశాస్త్రేషు ప్రజ్ఞావిశేషం పండితసమక్షం ప్రత్యక్షీకృత్య ముదా నారాయణస్మరణపూర్వకే ఆశీర్వాదపురస్సరేచ దత్తే ఇమే బిరుదే.

(1) దైవజ్ఞమణి (2) విద్వత్కవిరత్న ఇతిచ ఇతి నారాయణస్మరణమ్

శ్రీ త్రివిక్రమ రామానంద భారతీస్వామి

శ్రీసిద్ధేశ్వర పీఠాధిపతి, కుర్తాళము. తిరునల్వేలిజిల్లా

లైఫ్ ప్రెసిడెంటు, శంకరవిద్యాలయము బాపట్ల.

శ్రీరామపంచాయతన బ్రహ్మవిద్యాలయం; అనకాపల్లి.

శ్రీవేదపరిషత్. విజయనగరం; శంకరమఠం. విజయవాడ.

# విజ్ఞప్తి

కం. పదితొమ్మిది వందలము
ప్పదియారవ వర్షమందె ప్రభవంబగు ని
య్యది వచ్చెనేటి కచ్చున
కు, దయన్ నెచ్చెలులు హెచ్చుకూరిమిఁ దేరన్.

మ. స్వశ్రమిన్ వేగమ గించినన్ గని తమిన్ బద్యావళిన్ వ్రాయఁజే
యక నిర్మింపని గణ్యుఁడౌ గిడుగువంశాంభోధి చంద్రుండు జా
నకి రామాఖ్యునికిన్ గృతజ్ఞుఁడనుతన్ మాన్యాత్మసాయానఁ గా
కిఁక నేనీపదునేను వర్షములలో నేకావ్యమున్ వ్రాయమిన్.

మ. వశిమా నాకనకిచ్చెనాఁడెకొని కావ్యంబచ్చునందెచ్చి భ
వ్యశుభోక్తిన్ ననుగౌరవించిన లసత్వంగూరి వంశాంబురా
శి శరత్కాల నిశాతుషార నిలయున్ శ్రీనారశింహాహ్వయున్
దశదిగ్వ్యాప్తయశోవిశాలుగదయన్ దైవంబుగా పాడుతిన్.

కం. స్ఫుటభక్తి నీశువేడెద
నం। కమలకుటీర ముద్రణాలయనాథుం
దం। కున సమయామునకు నా
కిటు సాయంబైన సఖులనెల్లర బ్రోవన్.

మ. అనుబంధమ్మునఁగ వ్రాసి చేర్పఁబడు పత్రాళిన్ గడున్ వేగ మ
చ్చునకున్ దెచ్చుట హెచ్చుసాయపడు సంశుద్ధాంతరంగాన బొ
ల్చిన యాకేసరి ముద్రణాలయ విభున్ శ్రీపైడిమర్యాఖ్య వం
శ్యుని నైశ్వర్యము లిచ్చిబ్రోచుహరి శ్రీసూర్యప్రకాశాహ్వయున్.

గీ. ఎంతజాగరూకతతోఁడ నేర్పఱిచిన
నచ్చుతప్పులు దొర్లంగ నయ్యెవిందుఁ
దుదిని జేర్పంగఁబడియె వానిదయఁగాంచి
కలుగు శ్రీమకు క్షమింతురుగాత బుధులు!

శా. శ్రీరమ్యమ్ము బుధాళిగమ్యము గుణశ్రీసౌమ్యముగ్ బండితా
ళీరాజన్నిలయమ్మునా చెఱుకుమల్లి గ్రామమందెన్నికన్
మీరంగల్గిన క్షత్రియాన్వయమునన్ జెన్నొందు శ్రీ మంతెన
స్వాపోద్వంశమునన్ యశంబుగను బ్రజ్ఞన్ బద్మరాజెంతయున్.

మ. అతివిఖ్యాతి వహించిమించిన ఘనుండౌ పద్మరాజాఖ్యుడా
ధృతిసీతాంతియందు గాంచె సుతులన్ ద్రేతాగ్నులో యుంచు గీ
ర్తి త్రిమూర్తిత్రయమో యటంచు జనులార్యుల్ స్తోత్రముల్ సేయగా
నతుల ప్రాభవులైన ముఖ్యవరను విఖ్యాత ప్రభావాఢ్యులన్.

సీ. వీరిలో జ్యేష్ఠుండు వేంకటపతిరాజు
విత్తరణ ఖనియంచు బేరు గాంచె
ధీరుడందు ద్వితీయుడౌ రంగరాజాఖ్యు
డలిదైనపరుడుగా యశము గాంచె
నమలుడం దృతీయుడగు దుర్గరాజాఖ్యు
డుదకంబులిడి కృష్ణలో నరచెంచె
స్థానిక సంస్థలీతని వహియింప బ్ర
సిద్ధకార్యము లెన్నొ చేసి మించె
నందురంగరాజాఖ్య సౌమ్యగుణపేటి
కమల లక్ష్మీనరసమాంబ యందు బొడమె
ప్రథితరఘురామ చింతాపరాయణుండు
ప్రణుతి సుగుణుండు సత్యనారాయణుండు.

సీ. భూపతిరాజు లక్ష్మీపతిరాజాఖ్య
దాతయే వాని మాతామహుండు
వేంకట నరసాఖ్య విశ్రుతనామలగు
నాద్యయే వాని యమ్మమ్మగారు

వేంకటకృష్ణరాజాంకిత యాచక
ప్రాతియవని జ్యేష్ఠమాతులుండు
ప్రథితవేంకటనృసింహరాజాఖ్య సద్గుణ
మణియెవ్వాని ద్వితీయ మాతులుండు
నట్టి సద్గుణవ్రాతు దయాసమేతు
భవ్యగుణపూతుక్షత్రియవంశజాతు
నార్తసుర భూజునుతియింతు నమలతేజు
నలఘు తరసత్యనారాయణాఖ్యరాజు.

శా. లేఖోర్వీలలక్షణామండితంబయిన బల్ పెన్మత్స వంశంబునన్
ముఖ్యుల్ బంధితకీర్తి తాఖ్యురసదీప్తుల్ సూర్యనారాయణ
ప్రఖ్యాతోన్నత రాజపుంగవుని విద్వల్లోకభీతుల్ మామగా
విఖ్యాతింగానె నీమహామహులు సంప్రీతాత్ముడై యెంతయున్.

ఉ. మాయురె! యేమి చెల్పనగు, మంతెన వంశపయోధిచంద్రుడై
శ్రీయుతుడున్ సుకీయుతుడు శిష్టజనస్తుత సద్గుణాఢ్యుడున్
న్యాయపథానువర్తియగున నంతయగోస్వతుడైన సత్యనా
రాయణరాజశేఖరుని మహాత్ముని సచ్చరితాప్రసిద్ధిగన్.

వ. జనవిత్త పరిపాలనాధ్యక్షుడయ్యుఁ గనఁడీడినాత్రగర్వంబు, సా
గిననుఁ జేరఁ డధర్మపద్ధతిని, పరహితంబుఁ గాంక్షించు, ని
త్యానిరాడంబరజీవితుండై మను నవంతాత్యున్నతిన్ గ్రాలి, కా
ఫున. బంచాయతిబోర్డు పొందువిడ కెప్పు పిరిదనాఘుగన్.

కం. సిరియును వాణియు నొక్కట
నరలరు భువినన్నవార్త వమ్మగ మిగులన్
సిరినొంది కావ్యవిదుడై
కరమరుదుగదనసు నీ యఖండ గుణుండీటన్.

శా. ఆసామ్రాజ్యాత్మని లేమ యుప్రీతిమురాలౌ నా యశంబొందుల
క్ష్మీసీతాఖ్యను దైవభక్తిఁ బతిభక్తిన్ దీనదాసాదర

జ్ఞానసక్తిన్ వరదానశక్తి ఘనవిద్యారక్తి యుక్తిన్ మహో
ల్లాసం బేసమయంబునం దెసగి కల్లల్ లేని సద్బుద్ధులై.

ఉ. ఆయిలు సొచ్చివచ్చు ప్రతియాచకుఁ డర్థియు బంధుగుల్ సఖుల్
శ్రీయుతులైన నిర్ధనులు శిష్టులపండితులైనఁ గూడ యా
హా యని హాయినొందుచు దదర్పిత సత్కృతి గౌరవాదరా
మేయ కథానముల్ గుఱిచి మేలుగఁ బల్కుదు రెల్లకాలమున్.

గీ. ఆసతీపతులిరువురు నఖిలసద్గు
ణాళినొకరొకరిని మించుచుందు మఱియు
కేవలము రామగుణసీమ గేముగోము
ప్రేమనోము నేసుర కేమి క్షేమములర

కం. మచ్చునకుఁ బొంకుననే
పొచ్చెము లేనట్టి సుగుణమూర్తుల గనినా
యచ్చపుయుగ్మము మెచ్చుట
హెచ్చగ ధాత్రినొక ప్రసిద్ధిల్లరు బొగడన్.

చం. తనయుఁడు రంగరాజు సిరుధన్వంత సద్గుణుఁడొచు నాంగ్లప
ధ్యనుఁ గొనునాండెఁబట్టము, సుతామణి సీతయు సీతవైన్నవ
ర్తనముల వంశకీర్తులఁ గరమ్మెదిరమ్మధికమ్ము జేయు వీ
రిపి సుఖసంపదాయువులఁ బ్రేమనుఁ బ్రోతురుగాత దేవతల్!

ఉ. ఆకులఘుప్రవర్తనుఁ డుదంచితకీర్తియుతుండు సత్యనా
రాయణరాజ సామిమిమలాత్ముఁడు నేరచియించినట్టి ని
శ్శ్రేయస సచ్చరిత్రమును ప్రేముడి నచ్చునఁ దెచ్చు మూల్యమ
త్యాయతలీల నిచ్చుటకు నాస్థనుఁ జూపెసముత్సు కంబునన్.

శా. ఆయుస్సత్వసుఖాయురున్నతులు సమ్యక్స్థలిఁ బెంపొందగా
నాయీశావి సమస్తదేవతలు ప్రేమానంద పూర్ణాత్ములై
పాయంబొపుదు గాక వీరలకు నీసద్వంశ జాతాళికిన్,
గేయంబైన ప్రసిద్ధకార్యతతులన్ క్షేమంబిడన్ తాన్మస్థలిన్.

శా. శ్రీవాణీశ రమేశ శీతనగజాచేతోధవుల్ భూరిధీ
ప్రావీణ్యంబుల నీజగాలన్ సృజియింపన్ బెంపనుంపంగ నే
భావాతీతుఁడు నిల్చి వారిఘనసేవల్ పొందు నామూర్తి నా
కేవేళన్ విజయోన్నత ప్రదుఁడుగా నెంతేనిఁ గాపాడుతన్.

శా. శ్రీమద్దివ్యమునీంద్ర సేవితలసచ్చిత్సామగ్రుఁడున్, నిత్య ని
ష్ప్రాకామ్యుండాద్యుఁడు నామరూపగుణ నిస్సంగుండ జుండున్ జగ
ద్ధాముండయ్యును ధర్మరక్షణకు నిత్యంబున్ బ్రయత్నించు శ్రీ
రాముం డీకృతి నెల్లకాలమును సంరక్షించు నాతన్ కృపన్.

కం. గణనాయకరూపంబున
గణుతింపగఁ బరఁగు విఘ్నగణ వారణకా
రణచణుఁడై తగునీశుచ
రణమెంచెద నాదు కృషికరమ్ము ఫలింపన్.

చం. అమలినలీల నాదుహృదయాంతర పీఠమునందు నీదు ది
వ్యమహితరూపమున్ నిలిపి ప్రాంచితభక్తి నుతించెదన్ భవ
ద్విమల కృపార్ద్రదృష్టి నను వేఁగని నాకులలిన్ స్రవింపఁజే
యుము సుకవిత్వధారను మహోత్తము లెల్లరు మెచ్చ భారతీ!

మ. సరసజ్ఞాన కవిత్వ చూతవిటపీశాఖాస్థితంబై నిరం
తరమున్ నిస్తుల రామనామ మధురోద్యన్నామ గానంబు సుం
దరలీలన్ దిశలెల్ల హాయిగొన దద్దన్ జేయు వాల్మీకి భా
స్వర సత్కోకిల నాశ్రయింతు సుకవిత్వంబబ్బ నత్యంతమున్.

కం. వేదపయోనిధులన్నిటి
మేదురమతిమై మథించి మేలగుసారం
బాదృతి కవితతి కూర్చిన
యాదివ్య కళావిలాసు వ్యాసు నుతింతున్.

గీ. తక్కుఁగగు సంస్కృత కవీంద్రతతికి మ్రొక్కి
యాంధ్రకవినేత లెల్లరు నభినుతించి

భవ్యులగు పెద్దలకు భక్తి వందనమిడి
తొలఁగఁగా కవికాకముల లలివేడి.

కం. లోకంబున సత్కవిజన
లోకోచ్ఛిష్టముల నేరి లోఁగొని మను నా
కాకవికాకములను గడు
నాకాంక్షించెదను దూరమందున నుండన్.

చం. గురువులభక్తి గొల్చి కవికుంజరులన్నుతిఁజేసి దేవతా
స్మరదభివాదనంబిడి ప్రబుద్ధుల నాత్మఁదలంచి ధర్మవి
స్తరమగునట్టి లీచికృతిన్ రచియింపగ బూనితిన్ సుధీ
వరులు రసజ్ఞాగ్రణు లామోదమందగు నాదగు సాహసక్రియన్.

ముత్య సుబ్బారాయుడు.

# అభిప్రాయములు.

మ. అతిరమ్యమ్ము, లసత్కవిత్వమహిత, మ్మత్యద్భుతాపాదిచా
రిత్రవృత్తమ్ము ప్రశస్తనీతికల నొప్పవృత్తమ్ముఁ జంచత్కళా
న్వితమానందరసైకవాసముగు నీనిశ్శ్రేయసానంద సత్
కృతిరత్నమ్ము ప్రశస్తిఁ గాంచు జగతిన్ శ్రీసుబ్బరాయాహ్వయా

గీ. మోహవిస్మయ సంపాది, మేలుకయ్య
గాధ సుగాంగ స్వకపోల కల్పితంబు
బుద్ధిగల యువిధాన, నీబుద్ధియుంక
సుజనులకు నెల్ల స్తుత్యంబు సుబ్బరాయ!

శ్రీకవిరత్న కాకర్ల కొండలరాయ శతావధాని.

ఉ. శ్రీయుతముత్య వంశ్యుఁడు రచించిన యీరమణీయమైన ని
శ్శ్రేయస కావ్యమున్ జదువఁజేకులు మోదము నీతియుబ్బు ధా
రాయుతమై కవిత్వము విరాజిలుచుండుటఁ బాఠకాళికెం
దేయెడ నాదరంబొదవదే! బుధులెన్నగ! సుబ్బరాయనిన్!

శ్రీ నాదెళ్ళమేధా దక్షిణామూర్తి శాస్త్రి బందరు

శా. శ్రీమద్వేదశిరః ప్రబోధితవచ శ్శ్రీభోధనాథుస్యుఁడై
ధీమంత్రస్తోముఁడు సర్వకర్మవిదుఁడున్ దివ్యత్రపశ్చాలి స
ర్వామర్త్యస్తుత భూరిసద్గుణగణోపశ్యాత్మవభ్రాజితుం
డై మౌనీశ్వరుఁడా వశిష్ఠుఁడతులఖ్యాతి న్వెలుంగొందెరున్.

గీ. అతి విమలమైన శాంతశమాదిసుగుణ
మంజరీ కర్షిత సకలామర్త్యమర్త్య
భోగజాలురై యశమును బొందగనిరి
ధవిశాలమించు మైత్రావరుణులు.

సీ. వేదవేదాంగ వేదాంత వివిధమార్గ
విమల బోధనవర్తన సుమహిత చరి
తాఢ్యుఁడనసొప్పి కీడు మెప్పనొంది మిగుల
నెగడి పొగడునుగాంచె కౌండిన్యమునియు.

శా. …గోత్రంబిల వీరలాదిబుధులై యేపార నొప్పారు నా
న్యాశాదార్యగమాపునీతవిలసత్కౌండిన్య గోత్రంబునన్
… గుణ ముక్తసమాఖ్యఁగ్రాలు నొక వంశంబందు జన్మించె నెం
తే గోమొందుచుఁ బుల్లయామాత్యుఁడు సర్వేశప్రవర్తిన్ గడున్

చ. అల హిమశైలజా మృదుహృదంబుజ నాయక పాదవారిజా
తలలిత బంభరుండయి పదానిగమాగమ దివ్యపాండితీ
విలసితుఁడైన యవ్విమలవిప్రునికిన్ నరసాంబకున్ మహో
జ్వలమతు లిర్వురాత్మజులు నంభవమందిరి దృగ్యగంబునాన్.

చం. విమలవివేకి యవ్విదితవేద్యుఁడు వేంకటరామసోమయా
జి మొదటిపుత్రుఁడై యశముఁ జేకొని యజ్ఞముఁజేసి మించెఁ దా
నమలమతిన్ ద్వితీయుఁడు మహత్తర సూనృతవాగ్విలాసియై
విమల యశోన్నతిన్ గనెను వేంకటరామ సమాఖ్యుఁడెంతయున్.

కం. ఆ వేంకటరామునకును
నా విమలుని వెలది సుబ్బమాంబకు గొడుకుల్
దేవీత్రితయంబనగా
నావిర్భవ మొందిరి మువురాత్మజలులలిన్.

గీ. ధాత్రికసువులలోన విఖ్యాతి దాన
ధర్మములుఁజేసి మించిన దైవసముఁడు
మాన్యగుణుడు సుబ్బారాయ మహితకీర్తి
యాలయి వేంకటరాముని జ్యేష్ఠసుతుఁడు.

ఉ. శ్రోత్రతము నాదు స్మార్తమునఁ జక్కనిపాఁడిమించి సర్వసం
ప్రీతి మెలంగి క్షీరపురిఁ బ్రఖ్యగఁ గ్రాలిన సుబ్బరాయ వి
ఖ్యాతుని కల్లసోమమయు నా నరసాంబయు లక్ష్మిదేవియున్
బూతలు సోదరీమణులు భూరియశః పరిపూర్ణ లెంతయున్.

సీ. "భూసురాన్వయ శుక్తి ముక్తాఫలంబు నా
జనియించి యామ్నాయసమితి నెల్ల
సాంగార్థముగ దాము చదివి శిష్యాళికి
నధ్యాపనముచేసి రార్యసభల
కటుకంపించ నొక్కకణమైన యర్థుల
కిడనిచో దివ్యాన్నమిడిరి వీరు
వేంకటరామాఖ్య వెలయ నవ్వసుధాత్రి
వితరణమ్మున కర్ణు వెరగుపరచి

గీ. ఆయనకు సుబ్బరాయాఖ్యుఁ డవతరించె
జీర్ణదేవళముల బాగుచేయుటలును
పేదలకు వివాహములు చేయించుటలును
పెరకు సాయపడుటలును వీరివేడ్క."

శా. ఆవంశంబున సుకవీంద్రులెందరో తదీయంబౌ చరిత్రంబు సం
భావింపన్ గనియుండి నిగర్వియగు సుబ్బారాయ ధీశాలి సీ
తావామాంగిని సాధ్విగాఁగొని సుపుత్రశ్రేష్ఠులన్ ముగ్గురన్
దావాహ్నిత్రయమట్లుకాంచి ఘనమోదంబెప్పఁగా వర్ధిలెన్

శా. శ్రౌతస్మార్తములందు వైద్యమున చంచద్ధర్మశాస్త్రంబునన్
జ్యోతిశ్శాస్త్రమునందు ప్రజ్ఞ గడు విజ్ఞుల్ మెచ్చఁగాఁబొంది వి
ఖ్యాతిన్ గాంచెను రామలింగ లసదాఖ్యన్ జ్యేష్ఠుడా ముగ్గురన్
జేతోమోదముఁగాఁగ జేకొనితమిన్ శ్రీసుబ్బమాంబాసతిన్.

ఉ. కోరితసంజనే నడచి కూరిమిఁ జాపపయిన్ బరుండి వే
నూరికిఁబోయివచ్చు నొక యోధునిమాదిరి బంధుమిత్రులన్
జీరి యొకర్కరిన్ గని ప్రసిద్ధముతో హితముల్ వచించి యే
వారును బలత్కరించకుడు వంతను చెందకుడంచుఁబల్కి సు
స్వారమనంబుతో నుపనిషత్స్వరవంబొనరించి ప్రాణముల్
గ్రీలవిను సీఘను స ధీమహిమోన్నతి ప్రస్తుతిన్ గనెన్.

కం. ఈ ముగ్గురిలో గనిష్ఠుం
డౌ మాన్యుడు వేంకటరామయాఖ్యుఁడు వెలయున్
గామేశ్వరీ సతీయుతుఁ
డామోదకరాంతరంగుఁడతిధృతిఁ ఘనుడున్.

చం. నిజపురి కేబదామడను నిల్వగనై మృతిపైకొనంగ న
కకజముగ నప్రయత్నముగ గానగనౌ తన దత్తపుత్త్రితోఁ
డఁజనువులాలఁబల్కుచు హరాద్విధి, శాంతముమీరఁ దారకో
గ్రజవమతో మృతింగను నఖండపవిత్రుఁడు తన్మహాత్ముడున్.

ఉ. స్థాయిదమేయకీర్తియు నవార్యమనస్స్థదార్ఢ్యశోభితుం
డాయత లౌకికాగ్రణి నిరంతర తారకనామ చింతనా

ఆస్థానముల భూరియశమందుచున్న సం
గీతశాస్త్రజ్ఞుండు కృష్ణమూర్తి

గీ. శ్రీతెలుఁగుఁగ్రాలుఁ గాల్హాదభట్ట వంశ
దీపమైన కామేశ్వరీదేవి తనదు
సాధ్వీఁగాఁగఁ జేకొనుచు మజ్జనకుఁడెలమి
సర్వవిధ సౌఖ్యజాలము లుర్వీఁగనియె.

ఉ. ఈశ్వరభక్తిరీఁ గడు నిజేశ్వరభక్తి నిమించి సౌమ్యగా
విశ్వనుతాఖిలార్యగుణపేటిగ మేటిగ సాటివారిలో
శాశ్వతకీర్తినిన్ గనిన సాధ్వికి నాజనయిత్రియైన కా
మేశ్వరినిన్ మదీయహిత మేదురభక్తిఁ దలంచి మ్రొక్కెదున్.

క. వినయము భక్తియు రక్తియు | బెనఁగొన బిట్టభినుతింతు విమలతరయశో
ధనులును విజ్ఞానఘనులు | నన ఘనవినుతిఁ గన్న యట్టి పితరులన్.

---

## షష్ఠ్యంతములు.

కం. శ్రీకరునకు ముక్తిప్రద
శ్రీకరునకు భక్తజన వశీకరునకు మో
దాకరునకు జయకరునకు
శ్రీకాకుత్స్థాన్వయాబ్ధిశీతకరునికిన్

కం. ఖండిత చండారికధను
ర్దండునకుద్దండకీర్తి తతిపూర్ణబ్ర
హ్మాండునకు కాండకాండ
చ్ఛండితరిపుషండునకు యశశ్శౌండునకున్.

కం. పృథుల రఘువంశదుగ్ధాం
బుధిపూర్ణ సుధాకరునకు మునివరకథి త
ప్రథిత చరితా ప్రకరునకు
బుధనుత కళ్యాణ సుగుణపూతవరునికిన్.

కం. వనరోపము సేతుస్థితకును
వనజభవాద్యఖిల దివిజవారవినుత పా
వన జీవన ఘనునకు యూ
వర జాతకుగుణభుజంగ పక్షీంద్రునకున్.

కం. శ్రీరామునకు మునిమనోం
భోరుహ హాధామునకు భుక్తిముక్తిప్రద సు
స్ఫారిత నామునకు, దనుజ
వారవిరామునకు భక్తవరకామునకున్

గీ. పాదసీరజయుగ సమర్పణముగాఁగఁ
గనుపినదా మెప్పనిపుడు బల్కెంగనున్న
యట్టి నిర్త్యైయసానందమ నెడి కావ్య
మునకు గల కథాక్రమ మెట్టిదనినఁ గ్రమత.

---

# కవిగారి ఇతరగ్రంథములు

1. భక్తితత్వసుధాలహరి
2. హితైషిని
3. విదుషి (పద్యములలో నవల)

వలయువారు:— ముత్యాలసుబ్బారాయుడుగారు, పాలకొల్లు
ప. గో. జిల్లా. ఆనివార్యుడు,

# నిశ్శ్రేయసానందము.

## ప్రథమాశ్వాసము

కం|| శ్రీమద్వాణీశ రమే
శోమేశ్వరరూపరత్నకోత్తము విబుధ
స్తోమా సకలాపనిష్టామా!
రఘువంశసోమ! రాఘవరామా! 1

కం|| "శ్రీమంతంబును భాస్వ
ద్ధమశోభ్యము సమస్తదిగ్విఖ్యాతయశ
శ్రీమంతము వైష్ణానిక
ధామంబును నగుచు భారతక్ష్మాతలమొప్పన్. 2

చం|| కలుషముల బాపువట్టి యఘకాండము చేరెడి రచ్చపట్టి శ్రీ
కలితుల జేసిపంట యధికాగమదాంఘుల కన్నమంట తేన్నె
లలనకు బాలగండ విమలశ్రితకోటికి పైడికొండయున్
ఖలతృణపాళికిన్ జ్వలనఖాండము భారతఖండమెంతయున్. 3

శా|| కర్మప్రాభవమున్ వివేకము సౌఖ్యంబైన యాత్మస్థితిన్
ధర్మాత్మగ్రసుకర్మముల్ దెల్పి శాస్త్రస్తోమముల్ చేవమై
నిర్మాణించి సమస్తదిక్తటములన్ వెల్విన్ గమున్ మించియే
కర్మంబివ్విధ హిందుదేశమిటు వెన్కన్ బట్టె నన్నింటిలోన్. 4

కం॥ లో వెలి దానును నాత్మయె
గా విమలవివేకము పొయిఁ గనుగొని భూతం
బావిధిని స్వీయకర్మము
గావించు నసంగు డెనగగా భువి దివిజా! 10

ఉ॥ ఏది సమస్తపక్షహిత మిద్ధజగత్ప్రితిలోపతంబు నం
చాదిమునుల్ వచింతురో తగాపనిషత్ప్రతిపాదితాంచితా
హ్లాదపథంబు వీడికొని స్వాగ్రమనంబులఁ దోచు మార్గమే
యూని వచించుచున్న నదియుత్తమసూరా పథమై ప్రపంచసౌ
ఖ్యోదయకారి కాఁగలదొకో మఱియుక్ వెతఁగూర్చుఁ గాని సుం
తే దశఁజెందకుండవు సుమీ నిగమాంత విచారశూన్యసం
పాదము లెందుసంస్కరణ పట్లను కాని సనాతనప్రబో
ధాదులయందు గాని విధియంత్రటివాడు కడంగియుండినన్
గాదని యొక్కవేళఁ గనుగాసిలి సంస్కరణం బొకండును
త్పాదన జేసి యున్నఁ బ్రతిభక్ష బ్రకటించి సనాతనంపు న
ర్మాదుల నొందువట్టి యడియాసఁ బ్రచారము సల్పినన్ మహా
ఖేదమె యొట్టకుంగలుగఁ గేవల మాత్మ విధానయత్నమం
దేదిగ జేయు; మాదిరుల నేటికి దెల్పగ! నెన్ని యున్ని ధ
ర్మాదులు మాచుచుండఁగ రయంబుగ మారుచుచుంట లేమ? ధీ
భేద మతప్రతాది బహుభేదము లన్నియు వేదశీర్షసం
చోదిత ముఖ్యసూత్రము లసూయలచే విడనాడి స్వేచ్ఛమై
సోదనపుం దొకానొక రసప్రథమనంబుల స్వాప్నకాంక్షచే

ఖేదలవుల్ జనించు నెనుపోకడ లస్మదీయుఁ బోయి చాతురిన్
వైదికశాస్త్రజాలముల వానిసమర్థనఁ జేయఁజూచుచున్
జోగులమంచు నహంకృతుల శూన్యవివాదములందు మున్గుచున్
భేదము వృద్ధిచేసికొని బిట్టును జెట్టలఁ బుట్టఁ జేయుటన్
గాదె జనించుచుండెడు! నఖండబలంబుల నార్యధర్మముల్
మేదిని నుద్ధరింపు! డికమేయఫలమ్ములుగల్గు శాంతిసం
పాదన కింతకంటెను నుపాయములేదు ధరిత్రి ధీరులౌ
సోదరులందు భూరిసుగుణోన్నతులందు మతప్రచారణా
హ్లాదమనస్కులందు సముదంచిత సంస్కరణాభిలాషులం
దాదరమొంది యీవిషయ మాత్మల నిల్పెడినేని భూరిస
మ్మోదనమై యొల్లసం గలిగి పూతతరంబగు దేశమెన్నటన్!"

శా॥ ఈగీతింగడుఁ గర్ణపేయముగ నెంతే సూక్తిరావంబు లే
తేరం దత్స్వరమంగనాస్యనముగాఁ దీర్ఘానమున్ జేసి శా
తోరంబం దబలాస్వనం బెటులు సంక్షోభించె నంచంచితుం
డా రాజన్యవతంసు డచ్చెరువుతో నావంక వీక్షించుచున్! 18

గీ॥ బహువిధలతాంతసౌరభవంత మగుచు
జల్లనగు పిల్లతెమ్మెర మెల్లవీవ
సత్త్వగుణశోభితానేక సత్త్వతతుల
గనుచు నావైపు నడచె నమ్మనుజవిభుఁడు! 19

మ॥ "భుజపీఠస్థితశార్ఙ్గకాండములు సంపూర్ణాస్యవర్చస్సుగాం
చ జనేశాన్వయులంచుఁ దోఁచెడిని, చంచద్వేషభాషావలిన్
సుజనస్తుత్యతపస్వివంశ్యులని దోఁచున్, మీర లెవ్వార లిం
కఁ జరింపం గత మేమి యొంటిమెయి సంతోషంబునన్ జెల్వగే! 40

ఉ॥ రూపము విద్య శీలము నిరూఢిగఁ బోఁతనుబోసి యయ్యజుం
డేపురు సౌశిలంబు వెలయింప సృజించె ననంగ నొప్పుచున్
రూపునఁ బట్టి కన్యకఁ వివాహముఁ జేయఁగ వచ్చు నీలస
ద్రూపిణి యేమికావలె నెఱుంగఁగఁ జేయరె మాకు నెమ్మితోన్".

కం॥ అని పల్కినంతఁగ నాతఁడు
మునుఁ గాశ్మీరపతి కూతు మొదలు తపోవా
ఛను నటకుఁ జేరు టాదిగఁ
దనచరితముఁ దెల్పి పిదపఁ దరుణి విషయమై। 42

శా॥ "ఐదారేఁడుల ప్రాయమప్పు డట నయ్యబ్జాక్షి మాతృల్లిచే
సీదుర్గాంతవనానఁ ద్రోయఁబడి యుంతే స్వీయజన్మస్థలం
బౌ దేశంబును కోసలన్ జనఁగ నుత్సాహంజేయ దా రాజభో
గాదుల్ గోరక నాటఁగోలె సుతచాయన్ నిల్చె నా చెంగటన్. 43

కం॥ కాననుల ప్రోల్కై కూప
మ్మునఁ జరితను నమలమైన పుణ్యవతిని నీ
పెనుఁ బ్రేమఁ బిలిచి కొనుచుం
టిని నేను ధరాధినాథ! ప్రశ్రేయసగన్. 44

శా॥ పాద్యస్వాంతి సమానగామినికి నీమాన్యాంగలావణ్యస
ద్విద్యాశీలగుణస్వరూపఖని కేర్ధిరాత్మునిన్ గూర్చినన్
మద్యత్నంబు ఫలింప గల్గునని సంభావించి యొక్కొక్కటన్
మద్యోగాభ్యసనంబు గూడ మరతున్ సత్యంబు, రాజోత్తమా! 45

శా॥ ఆలోకింపఁ ద్వదీయలక్షణము లీవాపెట్ట మదిఁ గోరునా
శీలఁ గోచరమయ్యె నీముఖకళన్ వీక్షింప నౌదార్యస
చ్ఛీలాఖ్యండవటంచుఁ దోఁచు, నయినన్ క్షేమంబుగా దిట్టులీ
బాలన్ నిర్ధనరాజ్యహీనఁ గొనుటన్ భావింప నీబోంట్లకున్. 46

కం॥ కయ్యం బాడెడు వేళను
వియ్యంబును బొందఁ జూచు వేళను మిగులన్
నెయ్యము సలుపఁగఁ బోయెడు
నయ్యెడనున సమ్ములె వలయు ననుటను వినవే!" 47

కం॥ అని యోగి పలుకుచుండఁగఁ
గని ఘనవేణియును చాటుగా నిల్చియె యా
మనుజపతిఁ గన్నుఁ గొనలనె
కనుఁగొనె తనకుట్టు బయలుగాఁ గుతుకమునన్. 48

మ॥ శౌరిదృష్టిన్ బరిభవించియున్ బెనఁగి యుద్ధంబు నుద్రిక్తమై
తెలివిం బొల్చి ప్రతపందగిఁగియున్ దేకున్ ప్రేమంబుతో
మిళితంబైన కటాక్షవీక్షణము నమ్మేన్ మేదినీకాంతుపైఁ
గలువల్ దండగనై కడింది యతనిన్ గైసేసె నొక్కుమ్మడిన్. 49

కం॥ ఆమాత్ర మంత్రితుంబలె
నే మాత్రాకాల మామహీపతి జడుఁడై
మైమఱచి తేరి తమపఁ
దామానసమందు నిల్చు తలపోసెఁ గడున్. 50

శా॥ నానారాజకుమారికామణుల విన్నాణంబు వీక్షించు నా
డేనాఁడున్ జలియింపకున్న దిటవా యీ నామనం బిట్లు నేఁ
డీ నారీమణిపైని వ్రాలి మఱీసుంతే వీడ రాదేల! క
ర్మానీతంబిది గాఁగ నోపు!" నని యూహం జేయుచున్ ముగ్ధుడై.

ఆ॥ సకలవిబుధవినుతసచ్చరిత్రుఁడును
నతులరూపశోభవ్రుఁ డాఘ్యుఁడయ్యె
మదికినచ్చునట్టి మదిరాక్షిదొరకని
బ్రహ్మచర్యమింతవఱకు విడఁడు. 64

ఉ॥ అందమునందు భావములయందుఁ బ్రవర్తనమందు సత్కులం
బందు గుణంబులందు సముదంచితవిద్యలయందు నెన్నికో
రందగు కన్యకామణి ధరన్ గనరామిని నెందరెందఱో
సుందరమందగామినులఁ జూచియు బెండిలియాడ డింతకున్. 65

మ॥ మన నిశ్శ్రీయున భూరిసద్గుణవతిన్ మానిత్వమందున్ బవి
త్రనమిందున్ సకలంబునన్ బతికిదద్దన్ దుల్యమై పొల్చి యీ
ఘనదాంపత్యము ధారణీతలికిఁ జొక్కంబైన యాదర్శమై
తనరం గల్గుటఁ దోఁపఁ జేయుఁ గనుఁడీ తత్త్రప్రభాశోభలన్". 66

కం॥ ఈరీతి పాని పలుకఁగ
నారాజీవాక్షు లెల్ల రనిమిషలీలన్
వారిరువురిఁ గన దొడఁగిరి
ప్రీనని తనుకంబుగోడ దియ్యంబెసగన్. 67

తే॥ యోగివరుని సన్నయోషలు గ్రహియించి
నూత్నదంపతుల నవూన వివిధ
సూనమాలికాది శోభితులుగఁ జేసి
హార్దమంది రంతరంగములను. 68

చం॥ కడు జయరావముల్ సెలఁగఁగాఁ గరతాళములున్ ముదాన న
క్కడు చెలరేగ యోగి మదకుంజరయానకరమ్ము రాజుచే
సడి శుభసూక్తులం బలుక నిర్వురు మాలలదీసి మార్చుకోఁ
గడఁగిరి సూనవరము లఖండముగాఁ గురియింపఁగా సఖుల్. 69

మ॥ అటనగ్న్యాటవికుల్ కనంబడుచు ప్రేమానందభక్త్యాళి ము
చ్చటఁ గైసేతయు నుత్సవప్రతతి నెంచన్ శక్యమే! యెల్లరున్
దురితసర్వస్వము గూర్చిఁ పెండ్లిమహిపాదుల్ మెచ్చఁగాఁ జేసి ర
చ్చటి గ్రామింతల వైభవాదులకు హర్షంబంద వారెల్లరున్. 70

ప్రత్యర్థ్యంచలాహ్వానిగోష్ఠ్యము.

ఉ॥ నీరజజాగ్రి నిస్తులిత నిర్జర రాజి సునిశ్చితస్థితీ
సారధృతిన్ నుతింగాను ననంతరసోత్తర! సత్త్వనూజితో
న్నీరద! స్థిరశీర్షధృతనిస్తులశాసన! దోషశోషణా!
సారచరిత్ర! ధైర్యజితసానుధరా! ధరజాసుతాసఖా! 71

స్రగ్విణి

జానకీహృత్సరోజాతభృంగోత్తమా!
మానితోదారసన్మాని యోగీంద్ర వి
జ్ఞానిబృందారకాకాంక్షితాంచద్గుణా
దీనభక్తావనాసక్తచిత్తాంబుజా! 72

స్వాగత. స్ఫారదీర్ఘనుతసద్గుణసీమా!
వీరదైత్యకులభీకరనామా!
వారిజాప్తకులవారిధిసోమా!
సూరివంద్యగుణసుందరరామా!

గద్య:—

ఇతి శ్రీరామానుకంపాసంపాదిత ల... కవితాశ్రేయ కౌండిన్యగోత్ర
పవిత్ర ముత్త్యవంశపయఃపారావార రాకాసుధానిల
య కామేశ్వరాంబా సూర్యనారాయణార్య
తనయ విబుధవిధేయ శ్రీసుబ్బారాయ
ప్రణీతంబైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి ప్రథమాశ్వాసము

సమాప్తము.

శ్రీ

# నిశ్శ్రేయసానందము

## -: ద్వితీయాశ్వాసము :-

క॥ శ్రీకంఠ ధనుర్భంగ
ప్రాకటలీలావిశేషరంజిత సీతా
స్వీకప్రేమకటాక్ష బ
హూకృతకల్యాణరామ! యోగిస్తోమా!

శా॥ శ్రీకంఠప్రదరాసనార్ధనలసత్ క్రీడోల్లసత్కాంత్యంతసీ
తాకాంతామణి ప్రేమవీక్షణములన్ ధర్మాత్ముతా మానుల
స్వీకప్రేమ నొసంగు నక్షతల సంశోభిల్లి సంతుష్టుఁడౌ
నాకళ్యాణరమోద్వహుండు మిము నిత్యం బోముగాతన్ గృపన్"

క॥ ఇటు పరిపరివిధముల ని
స్ఫుటముగ నాశీర్వదించి భూమీపతి నా
దటఁ గని యిట్లు పలికెను ముని
పటుబుద్ధివిశేషవైభవ మ్మెసలారన్.

క॥ "ఈ నెఱుగని యస్థంబులు
భూవలయములోన నుండఁబో వయినను నా
భావమునకుఁ దృష్టికలుగఁ
గా వక్కాణింతు విను మకల్మషచరితా!

చ॥ కడుపసిబిడ్డయీవె, యవ్వఁ గాదన నేర్వదు పట్టణంపుసం
దడులకుఁ గ్రొత్త, మాయికమనఃపరిశీలనమన్నసున్న, నీ
నడిగని వర్తిలంగలుగు శక్తియు నున్నటులోఁప దేను నీ
యెడఁదవిశాలతంగని వహించితి ధైర్యము సుంత పంపఁగన్.

కం॥ సతి పతియందును దత్పతి
సతియందును సర్వమయుని జక్కన గనుచున్
ధృతిమెయిఁ బరస్పరసహా
యత నాత్మవివేక మొప్ప హర్షింపఁ దగున్.

కం॥ తనసతి తనయెడ నెటు మనఁ
దనకింపగు నటులె తానుఁ దప్పక యెపుడున్
దనసతి యెడలను నడువఁగఁ
గను నిర్మలుఁ డొకఁడె సొంపె ఘనుఁ డనఁ జొప్పన్"

కం॥ వైవాహిక సంస్కారము
కేవల తాత్కాలికమగు క్రియయయ్యును దే
హావసరపు సంబంధము
గా విమలవివేకి గనఁడు క్షేమమతి తెక్కన్.॥

మ॥ తమచే దేహమనః ప్రవృత్తులను సధ్యాత్మప్రవృత్త్యాళి ను
త్తమపాత్రాదుల భావిలోకవిమలత్వప్రాభవాళిన్ బ్రపం
చమునం దన్నిట యైక్యమున్న దగు సంస్కారంబెగా పెండ్లి యై
క్యము సంఘంబునకున్ మతంబునకు లేదంటన్ నిజంబున్న దే!

మ॥ ఒకకుక్షింభరతాప్రయోజనమునే యూహించుచున్ భోజనా
దికమున్ గూర్చుట కామవాంఛలనె తృప్తింగోరి పెండ్లాడు టా
ర్థికలాభాప్తికె విద్య నేర్చుటయుఁ గీర్తిప్రాప్తి వాంఛన్ బరో
పకృతిన్ జేయుట మూర్ఖకృత్యములుగాఁ బల్కంగ నాలింపవే!

చ॥ మహితసుఖాసుఖంబులు సమానముగా సహియింపఁ దోఁచుగా
విహితవిధుల్ పొనర్చి సుఖజీవులఁ జేలఁగ నుంచి జ్ఞుఁడుగా
సహితభవాబ్ధి దాటఁ గ్లినపై తనరారు గతిమతల్లినాన్
బహుసుఖసాధనంబగున వట్టి యచేతనవస్తువే కనన్?

చ॥ గృహిణియనంగ భార్యయును గేవలమీవు గృహస్థుఁడౌటచే
గృహమునకీవె నాథుఁడవు కేవల మామె తదీయదాసి యం
చహితములౌ తలంపులను స్వాంతతలంబునఁ జేరనీక స
ద్విహితగతిన్ గనుంగొనుచుఁ బ్రేమను గౌరవమొందుచుండుమా.

చం॥ ఎవరిమతానవారు తమకే యితరుల్ కడులోఁగి వర్తిలం
గవలె నటంచు నందులకుఁగా, నవమార్గము లెంచికాంచునం
టవలనఁ గాదె కాఁపురమునన్ నరకంబటు తోఁచు నైజని
త్యవిమలసౌఖ్యవర్తనకు దవ్వయి, భూపతి వంశదీపకా!

ఆ.వె॥ సౌఖ్యనరకములకు సతియె కారణమౌట
జూచి తెరిగి సతిని వాడవలయు
సతికి సద్గతులు సమకూరకున్నచోఁ
బతికి దేశమునకు భద్రమున్నె ?

కం॥ మణికంకణమున నాకం
కణమును మణిచేత నొప్పు కరణిని స్త్రీ
మణి నీచే నీకన్యా
మణిచే నీవును నమేయమాన్యత గనుఁడి!

చం॥ పసనిలనోపుచున్ శిశులభర్తలనిల్పుచు దైహికంబు మా
నసికముఁ దాత్వికమ్మును ఘనమ్మగు శక్తులయందు స్వచ్ఛతన్
రసభరితమ్ము రంజనకరమ్ము రమాయుతమై కరమ్ము సం
తసమిడు నీము గోము నిజు నల్వగురీతినిఁ జెల్వఁ దేవతెన్.

కం॥ సతిసాయమునన్ సమ్మతి
ధృతిమై పితృదేవమునిఋణముక్తిని గాం
చి తరించు నుపాయముగని
చతురతవర్తిల్లి సుఖయశంబులఁగనుమా.

క॥ అని యిటు లానరపతి సూ
తినిఁ గూర్చి వచించి పూని, లీలగనా బా
లనుఁ గని పలుకఁగఁ దొడఁగెను
ఘనమృదుగంభీరరీతిఁ గౌతుకమెసఁగన్.

క॥ పూతుఁడు సుగుణాన్వితుఁడు
ధూతపాపపంచకోగ్రదుర్మార్గగుణ
వ్రాతుఁడు ప్రతిభాతీతుఁడు
ప్రీతిమెయిఁ బలుకఁ దొడఁగెఁ బ్రియసుతఁ గనుచున్.

చం॥ గురుకులవాసమం దెఱిఁగితొన్న మహాత్మతత్త్వమెల్ల, భా
స్వరగతి సర్వమౌ క్రియలఁ బాటిలఁ జేయు గృహస్థమార్గమే
యిరవగు నాశ్రయంబనుట నీవు తదగ్నిపరీక్షయందుఁ జె
చ్చెర జయశీలవై యశముఁ జేకొనుమమ్మ, కుమారికామణీ!

చం. సరులును సందడుల్ గనని నట్టడవిన్ బ్రహ్మాగమాంత వా
క్సరణి మెలంగునీవు జనసంఘములందు సమస్తవైభవా
భిరతులయందు నిట్టులు గభీర సునిశ్చలితానుభూతిమైఁ
బరఁగెదవో కసన్ మహాత్మవైభవమబ్బునటంచు నెంచుమా!

చం. ఎవరు కలట్టిసర్వధన మీశ్వరభిక్షగ నెంచి యంతకెం
దు విమలులై మహాధృతిని దుఃఖసుఖంబులు లెక్కలేక తా
మవిరళరీతి నాత్మనిభులౌదురొ వారె ప్రపంచజన్మదు
ష్టవికృతులందుఁ గూలక యశస్సుఖముల్ గనుచుందురెప్పుడున్

చం. ఎఱుఁగుదురెల్లవారు పరులెవ్వరికేనియుఁ జెప్పుపట్ల గ్రం
థరచనలందు నీతి, తను దైనికజీవనమందు నీతి వా
గ్గరిసి వర్తిలంగను నఖండవివేకగుణాఢ్యుఁ డెక్కఁడే
ధాప్తపనీయుఁడో బుధుఁడు దాసమతిన్ విడఁబోకు మెప్పుడున్.

చం. సతిహితకార్యవర్తనల పట్లను దాసిని, యోచనాదులన్
హితసచివున్, సురూపమున నిందిర, నోర్పునఁ బృథ్వి, విందులం
దతులితమాత, హాసశయనాదుల రంభనుఁ బోలి నాథు సం
తతసుఖవార్ధిఁ దేల్చు గురుతంగను మెల్లపు డిందు నందునన్

చం. సకలకళావిశేషములఁ జక్కని విద్యల భేషజంబులం
బ్రకటితలీల నేర్చి గృహరాజ్యమునెల్ల స్వతంత్రవృత్తిఁ గొం
కక నడుపంగలట్టి యధికప్రతిభాదుల నొంది సాధ్వి భ
ర్తకు శిశుపాళికిం బహువిధంబుల బాసటగా నెలం గదా!

మ. పతియం దీశ్వరభక్తి పిన్నలయెడన్ వాత్సల్యశక్తిన్ భట
ప్రతతిన్ ఘోరదయాప్రసక్తి సమమర్త్యశ్రేణి రక్తిన్ గుమా
ర్గప్రతతిన్ భూరివిరక్తి ముక్తిని గనంగాసక్తియున్ యుక్తియున్
సతతానందముఁ గండితాదటము నిచ్చల్ గన్న వర్తిల్లుమా!

మ॥ బలవిద్యాగుణశీలసంపదలచే భాసిల్లి కాంతామత
ల్లులు స్త్రీధర్మము నేఁడు నిల్పఁగలరో లోకంబు నందం దెసూ
నెలఁతుక్ సౌఖ్యపరంపరల్ సతము భావిప్రాభవ ప్రేతరీ
తుల స్త్రీ సూర్యకపాళిఁ గొందుమని యెందున్ వారియుందుంట చేన్.

చం। ధనము ఋణమ్ము గోప్యతతి దానము మానము గౌరవంబు నా
స్తను గృహలోకవాళి మతితాపము వృత్తి రహస్యముల్ సుమం
త్రిసచయమున్ బయల్పఱుప రాదని యెఱింగి సతీపతుల్ సతం
బును వెలయన్ వలెన్ బరులపోడిమి నోర్చి సమున్నతస్థితిన్.

ఆ॥ పరిగావోన్నతుల కింకొకరు భంగ
మానహీలనీక ధర్మనిత్యతను ప్రబలి
తగుపరస్పరాభ్యుదయసాధనము లనఁగ
దంపతులు మన్న భువి స్వర్గతలము గాదె.

చం॥ పతిసెడెనంచుఁ దానుసెడి భర్త యలక్ష్యము సూపెనంచుఁ దా
నతుల విలక్షణంబుఁ గొని యాతఁడు విద్దెను మానఁ దాను మా
ని తలిరుఁబోఁడికంటె నతినీచత నాతఁడు వాని కంటె నీ
చత విరిబోఁడియున్ గొనుచు సంఘము నొంచగరాదు దీనటన్.

కం॥ బహునీతుల నిట్లు రాముని
తుహినకరాననను గాంచి తోషమ్మునఁ బె
క్కుహితమ్ములఁ బల్కి సుతా
సహవాసినులదెసఁ గాంచి సుశుభశీలన్.

కం॥ పరిణయముమాత్రనే మన
పొగియును విడ మనకుఁ గన్న నెయ్యంపుఁ గోరి
యురియఁగ సహవాసమునకు
సరియగు సంగంబులేని జగతిం జూడన్.

కం॥ తనయావియోగభవరూ
తన నెల్లను మాని బహువిధంబుల నిట్లు చిం
తనఁ జేయుచుండె నరపతి
తనపురమునందు యత్నతత్పరుఁ డగుటన్.

శా॥ ఆకాంతామణితోడ నాతని పురప్రాంతంబుఁ జేరంగ వా
రాకాంక్షన్ బతిమాలినన్ ముని యరణ్యంబందె నిల్వంగ దా
సాకల్యంబుగఁ గోర్కెఁ బూనుటను రాజన్యుండు తత్సేవకై
చేకూర్చెన్ గడుయోగ్యమైన భటరాజిన్ దద్వనాంతమ్మునన్.

చం॥ సకలజనంబులన్ దగిన చాయల తేఁడు బహూకరించి పూ
సికి వినయంబుతోఁ బ సతినిం బొనరించి వధూసమేతుఁడై
ప్రకటజయధ్వనుల్ చెలఁగ వాహనమెక్కి చమూసమూహ మ
త్యకలుషభక్తి వెంటఁ జన నాత్మపురాభిముఖంబుగాఁ జనెన్.

మ॥ భువనానందముగాఁగ షోడశకళాపూర్ణేందుఁ డారోహిణీ
ధవళాక్షీమణినట్టు లామెఁగొని భూదారుండు తేరెక్కుచుం
డ వియోగంబున నోర్వలేక మదిమంద్రాటంబునున్ బూని యా
యువతీలోకము యోగియున్ నిలచి రత్యుత్కంఠ నిశ్చేష్టులై.

మ। వసితాలోకముఁ దదృషిప్రవరుడున్ స్వాంతంబు పర్వల్ గొనన్
గనుచున్ నిల్చిరి మంత్రముగ్ధులటు రంగప్రేక్షకుల్ వోలె నా
తనిఁ దత్స్యందనముం దదీయవితతధ్వానంబుఁ దద్ధూళిఁ ద
ద్ఘనచక్రాదికచిహ్నముల్ క్రమత నంతన్ వట్టియాకాశమున్.

కం॥ ఇరుదెసలనుండి వదలిన
యిరువునకే పొగనువిడుచు చేగెడి పొగబం
డ్లరహిని వెనుకకె దృష్టుల
మఱలించుచుఁ జనిరి రెండువైపుల వారల్.

కం॥ ప్రజలెల్ల సంతసింపగ
సుజనస్తుత భూపుఁ డరిగె సుటుచిఁకీలన్
నిజపట్టణాభిముఖుఁడై
ధ్వజములు బిట్టెగురుచు శుభవార్తలఁ జాటన్.

చం। భళిమనరాజవచ్చె ననువారు వియోగముదుస్సహంబుఁగా
వొలగితి మన్న వారలు నమేయగుణాన్వితయైన లేమని
మ్ములఁగొనినాఁడు మంచిదియె పో! యనియెంది ముదంబురాశిలో
నుఁ గడుఁ దేలి నిర్మలత శోభిలువారును నైరి తత్పురిన్.

కం॥ తమ యేలిక యొకతన్వినిఁ
దమిఁ బెండిలియాడి పురికి దాపైన యుదం
తము నెఱిఁగి జనులు తమతమ
తమకంబుల నుత్సవపరితతిఁ బ్రకటింపన్

కం॥ తత్సమయంబున వారల
యుత్సాహము ప్రేమభరము నుత్కంఠయు నా
యుత్సవములు గైసేతలు
తత్సంతోషమును దెల్ప ధాతకువశమే!

కం॥ నవదంపతులను కనుగవ
నవలోకించిన జనంబు లయ్యెరువురి గూ
ర్పువిలాసభూరిసంప
త్సవిశేషంబులను మిగులఁ జొక్కెడువారై.

ఉ॥ అన్నిటికన్న నిత్యమును నన్నిరవద్యపవిత్రనంబునం
దెన్నికగన్న సద్గుణము లెన్నియొ చూఁచుటచేత నామెఁగ
న్గొన్న జనంబు, రూపమునుగొన్న గుణంబులపుంజమంచు లే
మ న్నతిఁజేసి బిట్టుమది మన్ననసేయనివారు లేరటన్.

ఉ॥ ఆమెయుఁగూడ దంభము నహంకృతియున్ గర్వంబు నాదిగా
నేమియు దుర్గుణంబు లొకయింతయు లేక సమస్తజీవులం
బ్రేమను గారవించుచు ననేకవిధంబుల నెల్లవారిలో
సీమున వన్నెకెక్కె మనఁ గేవల ధార్మికమూర్తియో యనన్.

ఉ॥ పిన్నలఁ గన్న బిడ్డలుగఁ బెద్దలఁ దిద్దియు దేవునట్లుగా
నెన్ను సతిలలామ యెప్పుడెంతియు మానని హర్షచిహ్నపుం
గన్నులలేమ సర్వజనగణ్యతనొందిన కామ స్వప్నమం
దున్నయరీతిపీడని వధూమణి యామె యమేయ యెంచులన్.

చం॥ ఘనచరితాఢ్యతా నచిరకాలములోననె యెల్లవారి మ
న్ననలనుఁ బొంది సర్వసుగుణంబుల ప్రోవగుచున్ నిజేశు న
మ్మనమును జూఱఁగొఁగలిగి మంజులవాగ్విభవాభిరామయై
యనితరసాధ్యసద్యశము నందెఁ గడిందియు రాజ్యమంతటన్.

మ॥ పురమం దేయొకమూలనో యొకఁడు సంబోధించి నిశ్శ్రేయసా
తరుణీరత్నము జన్మవంశము జనిస్థానంబుఁ బ్రశ్నించినన్
వరరాజ్ఞీమణి సద్గుణప్రతతియున్ భవ్యస్వరూపంబు నె
ల్లర ముగ్ధాత్ములఁజేసి తద్విషయమెల్లన్ మర్వఁజేసెన్ గడున్.

మ॥ సకలైశ్వర్యములందియున్నను దైవైశ్వర్యమ్మునన్మగ్ని స్వీ
యకథన్ విస్మృతినొంద కామె తన కామైశ్వర్యవారాశి కం
తకు సంబంధము గుర్తెఱుంగుటను దద్సంగాన సమ్మోహమొం
దక యగ్రంబగురీతి వర్తిలి దిగంతఖ్యాతి గాంచెన్ గడున్.

చ॥ ఉరమున నర్షగేహమున నూరువునందు ముఖమ్మునందు స్వీ
యరిమణులన్ వహించిన యనంతరసోత్తరుతా మహామహుల్
వరయుగమందు బిట్టుఁ గనుబట్టు పరస్పరమైత్రియున్ దమిన్
గరుణయు స్వేచ్ఛ మున్నగు గుణంబులఁ గన్గొని వింతనొందరే!

గీ॥ సంపదాదులసంగంబు చాలఁ గలిగి
స్వీయసత్యంబు విస్మృతిఁ జేయలేదు
సంపదాదుల సంగంబు సడలఁజేయ
సంపదలఁ దృణీకారంబు సలుపలేము.

మ॥ అనయం బన్నిటియందు మోదము నెయన్యోన్యంబు సేకూర్చుచున్
ఘనవిశ్వంబును బ్రేమదృష్టి సతమున్ గన్గొన్చు విశ్వంబుచే
తను ప్రేమంబునఁ గాంచఁగాఁబడుచు నేతద్దంపతుల్ రూపమం
దిన యానందరసమ్మొకో యనగ నుద్గసించి రెంతేనియున్.

మ. కమనీయోత్తమ హాసశోభిత లసత్కంజాత వక్త్రంబుచే,
నమృతంబు న్నిరసించు స్వచ్ఛమృదుభవ్యప్రేమ వాక్యాళిచే,
నమలంబైన విశాలమానసముచే నాపద్మపత్రాయతా
క్షి మనోనాథుని మానసమ్మున కతిక్షిప్రమ్ము గానెక్కెడిన్!

కం. రమణీయత ననుకూలత
నమలిన మానసమునందు నన్నిట సమమై
యమరిన సతి గల పురుషున
కమరేశత్వ మ్మొకట్టిపోయినిఁ గూర్చునగా||

మ|| బలవిద్యాధన రమ్యతాదులఁ సమత్వం బబ్బి పద్మాక్షులయి
మ్మల నెంతే ననుకూలలై పతికి నింపుం గూర్చుచుం బొల్చు వా
రలకారోగ్యసుఖాయువుల్ విధికృపార్ద్రస్వాంతుఁడై కూర్చ ని
శ్చలతన్ వారలు కాంచదన్నరె సురేశత్వం బలక్ష్యంబునన్!||

ఉ|| ఆధరణీశుఁడున్ గృహమునం దిటు మోదమహాబ్ధిఁ దేలుచున్
బాధలఁ బాపి స్వప్రజల భవ్యసుఖమ్ములఁ దేల్చుచున్ ప్రజా
హితుఁడయ్యె నన్నిటఁ గరమ్ము సమర్థతఁ గ్రాలి లేఁడు భూ
నాధుల యందుఁ దత్సముడనన్ యశమందె సమస్తదిక్కులన్||

చం. అతిసుకుమార మారజనకా! జనకామడ! కామదాహకా!
శత్రి! శ్రితపాల! పాలితశచీహృదయేశ! దయేశ! యీశసం
స్తుతఘననామ! నామపరితోషితసన్మునికాండ! కాండని
ర్జితరిపుధీర! ధీరగుణసింధువరా! వరజానకీవరా!

సుగంధి. భానువంశవారిధిక్షపాకరా! మనోహరా!
దానవేంద్రభూరిగర్వతాడనప్రభావరా!
మానిశేఖరస్తుతోత్తమప్రభావభాసురా!
జానకీసతీహృదంబుజాతదివ్యభాస్కరా!

మాలిని, అమలినమృదుహాసా! యర్క-కోటిప్రభాసా!

విమలకమలనేత్రా! విశ్రుతోద్యచ్చరిత్రా!

సుమతివినుతనామా! సూర్యవంశాబ్ధిసోమా!

విమతతతివిరామా! విశ్వవిఖ్యాతరామా!

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధౌరేయ కౌండిన్య
గోత్రపవిత్ర ముత్యవంశపయఃపారావార రాకా
సుధానిలయ కామేశ్వరాంబా సూర్యనారాయ
ణార్య తనయ విబుధవిధేయ
శ్రీసుబ్బారాయ ప్రణీతం
బైన నిశ్శ్రేయసానంద
కా వ్య మం ద లి
ద్వితీయాశ్వాసము
స మా ప్త ము.

---



శ్రీ

# నిశ్శ్రేయసానందము

-: తృతీయాశ్వాసము :-

కం. శ్రీజానకీసతీహృ
ద్రాజా! రాజాధిరాజ రాజితతేజా!
తేజోమయ మునిదివిష
ద్భూజా! భూజానిరాజిపూజిత రామా!

మ. ఋణమున్ వహ్నియు మేఘముల్ జినుఁగు నంతేఁ జిన్నదైనోల్ల దా
రుణమౌ రీతిని వృద్ధియై పిదప మీఱుల్ గాదె కష్టాళిఁ జేరి
రణమున్ జేయుచు, నల్లి శంకతోలిఁ బ్రారంభించుచో స్వల్ప కా
రణమై పిమ్మట వృద్ధినందు వెతగూర్పంజాలు నెన్నాళికిన్.

చం. తరుణి కళిమాన ఫాల్గుహిమధామసమాస్యను బుత్రికామణిన్
గరము సురూపసంపదలఁ గంతు జయంతుల గేరు పుత్రు, భా
సురగతిఁ గాంచి వర్ధిలెడు చొప్పును గన్గొను భాగ్యమబ్బుటన్
పురజనులందు వర్తిలెడు మోదము మేరను తెల్ప శక్యమే.

చం. క్రమముగఁ గొంతకాల మటుగాగ జనంబుల మోదమంతయున్
సమయఁగఁ జొచ్చె మెప్పుఁగ విచారము నీసు,నగౌరవంబు ద్వే
షము జనియించి వృద్ధియయి సర్వజనంబుల జేరుచున్ సభా
ళి ముఖమునన్ బయల్పడి బలీయముగాఁ గననయ్యె నెల్లెడన్.

చం. ఎటుజనియించి యుండెడినో యేరు నెఱుంగఁగలేని యామె తా
నటు తమరాణియౌటయుఁ దదాత్మజుఁడున్ దమరాజ్యమేలనుం
డుటయును మేలుగాదనెడి నూతనభావము లుత్పత్తిల్ల సం
కటపడి కొల్లరున్ గ్రమముగాఁ బురి చిన్నలు పెద్దలచ్చటన్

చం. ప్రేమంబూనిన యేని రాజు కడు సంప్రీతిన్ వివాహంబు నే
భామారత్నము నైనఁ జేసికొనుటల్ భావ్యంబగున్ గాని మా
సీమన్ బాలనసేయ నుత్తమకులస్త్రీరత్న సంజాతుఁడౌ
శ్రీమంతుండె సమర్హుఁ డంచు మహితోద్రేకంబువారొందుటన్.

గీ. గుజగుజలు మాఱి పైసభాగోష్ఠిఁ జేరి
యాయసమ్మతి ప్రకటన నధిగమించి
సామురాయుక విజ్ఞప్తి సరణి మాఱి
క్రమత మంత్రిపుంగవుని నిర్బంధపఱుప.

ఉ. ఆ సచివాగ్రగణ్యుఁడు ధరాధిపుఁ జేరి నయంబునన్ నతిం
జేసి వచింప నూరుకొననేరక గ్రొడ్డను నీకుగ్రక్కుచున్
వీసముదాన కెల్లెడను విస్తృతమైన సమస్తభావముల్
పూసలుగ్రుచ్చినట్లు నృపుండువినన్ వచియించి యాపయిన్.

గీ. సర్వవిధముల యత్నంబు సలిపికూడ
వారితీవ్రతఁ దాను మార్పంగలేమి
తెలిపి కలిగిన ముప్పుగిడ్డలను వదలు
నెడల సుంత శాంతింతునం చెఱుకపఱుప.

మ. ఒడయం డద్ది సమస్తమున్విని తదీయోద్వేగసర్వస్వమె
క్కుడు శ్రద్ధన్ గమనించి తాఁ బ్రజలపైఁ గోపంబునుం బూనక
ప్పుడఁతిం దత్కుల గౌరవంబు దనరేనన్ లాతులూహించుచు 'టె
ప్పుడశక్యం బగుటన్ దదీయవచనంబుల్ యుక్తమే యంచుదాన్.

చం. “తలకొని యామె జన్మము విధమ్ము గలట్టులు పైకిఁ దేఱ ని
చ్చలుఁ బొనరించు యత్నములు చక్కగ సాగెడిలోన నింత లిం
తలు గడునాపరాకపయి దార్కొను నివ్విధిఁ గాంచ సర్వరీ
తుల విధి వోదితంబనియె [illegible]మను నాకది మార్పశక్యమే !

కం. కోసలదేశములో నీ
వా సంగతి బయలుసేయ నతిచాతురత నెం
తేసలుపు ప్రబలయత్నము
లీసరికి ఫలించి యున్న నిది కలుగునొకో!

చం. ఎటువిధి త్రోయు నావిధిని నేఁగుచు నాపఁగరాని దానినో
పుట విధికార్యమై యెదుటఁ బొల్చెడు కార్యము జంకులేక యు
త్కటమతి స్వార్థబుద్ధి మమతల్ విడిచేయుటగాక సుంతమా
ర్చుటకును వేగిరించుటకు శాలికి శక్యమె? మంత్రిశేఖరా!"

కం. అని యిటు కొన్నిటి సంగతు
లను విశదముగాఁగ నైయిలాపతి యూహాం
త్రినిఁగాంచి పలికి పిమ్మట
మనమున యోచించి సుంతమాఁగని ధృతితోఁ.

కం. ఏతత్సమస్తముఁ దన
నాతికెఱింగింపఁ గోరి సరవకుఁ డా భా
మాతిలకముగల సౌధము
నాతని ధృతిఁ జేరె సచివుఁ డటకున్ గొనుచున్.

ఉ. "జంకఁడు చీరికిం గొనఁడు సంఘము వేగిరపాటు చెంద నీ
వంకననందు సుస్థిరతఁ బాయఁడు హాసయుతాస్యమందుఁ గో
పాంకము లేనిఁ దేఁడు విధియట్లు విధించె ననందు బాపురే!
శంకరుఁడైన నాతనికి సాటియె సుస్థిరమానసంబునన్.

గీ. భవ్యులను ఘనప్రేమైకభాజనులును
అమలులుఁ రసికందులును బ్రాహ్మణాధికులును
నైన కన్నబిడ్డల పీడ వడుగు నవుడు
కందు చెందని ఘనుఁడెందుఁ గలుగునొక్కొ..!

గీ. స్వీయపట్టణ మనలంపు శిఖలఁ దగులఁ
గనుచు శాంతిమై నిలిచిన జనకుఁ డొకఁడు
పూర్వ మిందెనటంచుఁ జెప్పుదురు గాని
అట్టినిస్సంగు నేఁడిట నరయఁగంటి.

ఉ. మంచియొ చెడ్డయో జరుగ మాటికిమాటికి దానిఁ గూర్చి యే
యెంచుచుఁ గార్యముల్ విడుచుహీనుఁ డొకండునొకింత యెంచినన్
బ్రాంచితకార్యరాజివిడువన్ జనకుండెడు ధీమదోక్తిఁ డొ
క్కించుకయున్ బొసంగనటులే స్థిరుఁడౌ మహనీయుఁ డొక్కఁడున్.

కం. ఈలీల సచివపుంగవు
డాలోచనఁ సేయుచుండు నాలో నృపుఁ డా
లోలాక్షి యెదుటఁ దెలిపెఁ బ్రి
జాలోకపుఁ గలకలమ్ము సకలముఁ గ్రమతిన్॥

మ. తనప్రాణమ్ములకన్న మిన్నగ ననంతప్రేమమైఁ గాంచి పెం
చిన యాబిడ్డల నిచ్చివేయుమని ప్రశ్నింపంగ నాలేమ యి
ట్లనియెన్ మెల్లన మందహాసగతి వక్త్రాబ్జంబునన్ మాన్పు నొం
దని స్థైర్యంబునుఁ దెల్పఁగాఁ బతికి నుద్య[illegible] క్రమొక్కమున్॥

శా. "ఈమాత్రమ్మున కేల నాకసహ మీకే తెంచి వాక్రుమ్మటల్
వామాలోకము భర్తృవాక్యసరణిన్ వర్తించుటే కాని వే
రేమైన న్వచియించు టర్హమయి యున్నే భేదభావంబులం
దేమాత్రంబు సతీపతుల్ మనిన వారేకాత్మ్యులం టొప్పనే!

మ. మనయీవైభవముల్ శరీరములు శుంభల్లీల సర్వప్రజా
ధనవృద్ధంబులు తత్ప్రయోజననియుక్తంబుల్ తదానంద వ
ర్ధనమాత్రప్రకటంబు లౌట నపి సొంతమ్మంచు నాత్మేచ్ఛఁ ద
ద్వినియోగమ్మునఁ గాక యన్యమగు రీతిన్ జేయఁగా భావ్యమే॥

శా॥ ధృత్యుత్సాహబలాఢ్యులై యనిమొనన్ దీపింపగా జేయుటన్,
బ్రత్యూహమ్ముల రాజ్యవృద్ధికరమౌ ప్రఖ్యాతకార్యావళిన్
బ్రత్యేకంబుగ నీవిసుంగు లసువుల్ పాయంగఁ గాకిట్టి లీ
యత్యల్పంబగు ప్రాయమందు విడుటన్ స్వాంతంబువంతంగొనున్.

మ. సకలంబౌ మనసంపదాదులును నేసర్వేశుకారుణ్యదృ
ష్టికిఁ బాత్రింబయినంతఁగల్గెడినొ తచ్చిన్మాత్రునేర్పాటుచే,
నొకవేళన్ విడనైన నందుఁగల యేవోకోన్నటిన్ నేఁడు, దా
నికినై చింతనుబూను టర్హగతియౌనే ప్రాజ్ఞులెవ్వారికిన్! ।

చం. అని ముదమార నిర్వురగు నర్భకులన్ బిలిపించి ప్రేమమై
ననుపమసుందరాంగులగు నాసుగుణాకరులన్ గరంబు, బ్రీ
తిని గడుముద్దులాడుచుఁ బతింగని బిడ్డలనొప్పగించె నా,
పిన నిల కన్రు లిర్వురకు వేఁ గడుధారలు కార నేఱులై.

శా. ప్రారబ్ధస్థితిచేఁ బొసంగెడు సుఖప్రాప్తిన్ వ్యథాప్రాప్తినిన్
స్వారాహ్లాదము దుఃఖమున్ గనక యెవ్వండోపఁగా నేర్చుఁ దా
నారీతిన్ సుఖదుఃఖసంహతుల నిత్యంబున్ గనుంగొంచు యో
గారూఢస్థితిఁ బాయకుండును బుధుం డానందసంపూర్ణుఁడై.

చం. ఇరువురి బిడ్డలన్ గొని యహీనశమంబున తేను మంత్రిశే
ఖరుని కరమ్మునన్ గరము గౌరవమొప్పఁగ నుంచినన్ బ్రజో
త్కరములుగాంచి వారల యఖండవిరాగము నెంచి బిట్టున
చ్చెరువడిరందు కొందరిటుచేసితిమేయని కుంతి రాత్మలన్.

ఉ. వారలలోన కొందరతిభాసురబుద్ధివిశాలులంచుఁ బెం
పారినవారు వారలను నారహిమీఅమనంగనీయ భూ
దారుని బుద్ధిమాతీ పెడదారిని స్త్రరిన, వారిఁగ్రిమ్మలన్
జేంచి రాజ్యమిచ్చు నెడఁ జేయునదేమి యటంచు పల్కినన్.

కం. క్రమమున నేతదభిప్రా
యము మొ యుక్తమటంచు జనములందుఁ బలువు రా
సమయంబునఁ బసివాపల
సముఖుంచి శుభంబుఁగూర్ప సమయము సేయున్.

కం. అటు లవ్వారలు పల్కఁడు
స్ఫుటవాక్యంబులకు సచివపుంగవుఁ డెంతే
గటకటపడి యర్భకులను
నటవికి ననుపుటలు చాలదా! యని వారిన్.

ఆ.వె. వారివారి వాదవారంబులను మార్చి
యుత్తమమగురీతి నొప్పగించి
అతిరయంబుమీర నర్భకు లిరువుర
నంపి నైచె వారు హర్షమొంద.

మ. జరిగెన్ బిమ్మటఁ గొన్నివర్షము లటుల్ శాంతంబుగా నైనను
ర్వ్యరకున్ రాణిగ వారుకోరుకొను సద్వంశోద్భవన్ రాజు తా
నరయన్ లేదిఁక నాప్రజాప్రతినిధుల్ యత్నంబులెన్నేని జే
సిరిగా కెందును గాంచలే రటులు వాసింగన్న కన్యామణిన్.

మ. అలినీలాలక యామె యుండ, నిఁక దా నన్యాంగనన్ బెండ్లికిన్
గలయంజూడఁగు తేఁడు, వారుగనినం గాంతామహాసక్తుఁడౌ
నలభూకాంతుని పెండ్లియాడఁగల యజ్ఞాక్షిన్ గనన్ జాలరి
ట్టాలు గాలంబగునంచు సందసులు బిట్టున్ రేగె రాజ్యంబునన్

మ. అతినన్ దద్పతి పూర్వరీతిగ నరణ్యంబందుఁ జేర్పించి స
మ్మతిమై వారల రీతినే సుముఖతన్ బద్మాక్షికై యత్నము
ద్ధతిఁ గావింపక రాజ్యమేలఁ దనసత్సంతానమేరీతిగా
నతఁడొందంగలవాఁ డటన్న నుడి రాజ్యంబందు మార్మ్రోగఁగన్.

చం. అది విని ధారుణీరమణు డావిషయమ్ము సతీలలామ కు
న్నది కలరీతిఁ దెల్పుటయు నాతి సమస్తము నాలకించి న
మ్మదిఁ బదిలంబుఁ జేసి పలుమారుఁ బరేశుఁ దలంచి నాథునిన్
సదమలభక్తి మ్రొక్కి సువచఃపరిపాక మెలర్ప నిట్లనున్.

గీ. "ఆగమాపాయులును ననిత్యములు నగుచుఁ
బొలుచు వైభవాదుల రాకపోకలందు
మోదఖేదాళి నరుఁ డొందఁ బోలు నొక్కొ
తనకు వానికిఁ గల్గు భేదంబుఁ దెలిసి.

చ. జనహితకార్యమై యిది యొసంగుట, మీరలు కూడ నిట్టులే
యొనరుప మేలటంచు మదినూహనొనర్చుట, నంతకంటె నా
కు నిఁక హితంబు కల్గునొకో! కూరిమిమీఱఁగఁ గాన కేగి యా
ఘనుఁడగు సన్మునీశ్వరు నఖండధృతిన్ భజియింతుఁ గ్రమ్మఱన్.

గీ. అంచులకుఁ గట్టబడి నట్టి జ్యానుఁ ద్రుంపఁ
దగ యథాస్థితిఁ గొను బాణదండ మట్లు
పౌరవాసకారణులగు మీరు విడినఁ
బూర్వ వనవాసమున కేను బోదుసుందు!

చ. ఎసఁగు సుఖాసుఖమ్ముల కొకింతుక మాఱని పూర్ణశాంతితోఁ
బసమెయి సర్వకార్యముల వర్తిలఁగల్గిన మేటి నేర్పుతో
నుసలఁగలట్టి మానవుఁడె మానవులం గడు మిన్న కాని యే
దెస కెద్రోయ నాదెస నతివ్యథఁ గూలెడు వాఁడు మర్త్యుడే?

మ. ప్రజలందే యొకమాటనుం బడని దివ్యంబౌ పథంబందు బి
ట్టుఁ జరింపంగల యద్వితీయ చరితాఢ్యుండైన శ్రీరామచం
ద్రు జయింపన్ దగు ధీరవర్తనులు మీకోరంపుఁ దీర్మాన రీ
తిఁ జరింపం గని ధన్యుఁగా గలుగుటల్ దేటుక్కు మజ్జన్మమున్.

మ. అని హర్షంబు మెయిన్ వచించి మహితోద్యత్ప్రేమ నొక్కుమ్మడిన్
దన ప్రాణేశుఁ గవుంగిలించికొని కాంతారత్న మొక్కింతసే
పునకున్ లోపలి కేగి భూషణతతిన్ బుట్టంబుల న్వీడుచున్
వనవాసార్హపు దుస్తులం గొని ప్రియాణాంబై పతిం గాంచుచున్.

ఉ. "ఎచ్చట నెంతదూరమున నీతనువున్నను స్వాంతమెప్పుడున్
త్వచ్చరణాంబుజాతముల పజ్జనె సుమ్ము నిరంతరం బిటుల్
హెచ్చగు భక్తిఁ గ్రాలెడు, నహీనచరిత్రిక! దూరగమోల్లు భా
స్వచ్ఛిరమైత్రికిఁ గలదు భంగ మొకింతయు నెట్టివారికిన్"

గీ. బర్హి మేఘంబులకు నవోత్పల హిమాంశు
లకును బద్మినీ దిననాథులకును దూర
మెంతయుండిన మైత్రి కేయుగ్గు కలిగె!
దూరమెందు సుజనమైత్రిఁ ద్రోయఁ గలదె?

ఉ. స్వాంతము మీపయిం దను వవారితలీలవనంబులోన న
త్యంతము నిల్చియుండును, ధరాధిప! పట్టునుబట్టి య య్యయ
స్వాంతమునుండి లాగఁబడి క్రాలు నయోమయ సూచియో లె నీ
చెంతనె దృష్టిగల్గి విధిచేత వనస్థలి నేను నిల్చినన్.

మ. అతులంబైన విశాలభావములు స్వామ్మీ మీకు పెంపారుటన్
సతినిం బిల్చి పరిస్థితుల్ తెలిపి స్వేచ్ఛన్ యుక్తమార్గంబుఁజొచ్చి
దరింపన్ దరుణంబు గూర్చితి, యశశ్శ్రీగౌరి మార్గాలటన్ జతు
గత్వంబున గానకంపక, కృతజ్ఞన్ నీకు, ప్రాణేశ్వరా!

చ. సకలజనంబు సంస్తుతులు సల్పఁగ సద్గుణశోభితుండవై
ప్రకటవివేక మేర్పడగ రాజ్యజనుల్ కడుమెచ్చునట్లు సా
ధ్వికిఁ బతివై సమస్తమగు దివ్యసుఖంబులఁ బొందుచున్
ప్రజాళికి సుఖదాయకుండవయి లీలమెలంగుము ప్రాణనాయకా!

శా. ఏనారీమణి నిన్నుఁ జేకొనిన నేనీశ్వంగొనంబోనుసూ
నేనీదాన నెగాన! నీజయసుఖానీకాదులే నావిగా
నానందించుచుఁ దద్వనాంతరములం దావాసముం జేయుదున్
నేనట్లుంటకుఁ జింతనొందకు, ఎని న్నే మోదమే పొందుటన్.

కం. కృపమాత్ర మెప్పుడు నాపై
నృపనాయక వీడఁబోకు! నీవేగతిగా
విపినస్థలి వసియించెద
నపరిమితప్రియము నయము హర్షము నెసఁగన్!

శా. ప్రేమంబెంతయు నాపయిన్ గల మిముం బీడన్ మహాదుఃఖం
బై మత్ప్రాణము పోవనున్నను భవదీయాదేశముంగొంచు మీ
యామోదంబె మదీయమోదముగ మత్స్వాంతంబునం దెంచి యీ
సీమన్ వీడుచునుంటి మీపటమె మచ్చిత్తంబునన్ హత్తుచున్.

చ. సురుచిరహాసము దృష్టజనశుద్ధికరమ్ము శుభావహమ్ము భా
స్వరకరుణామయమ్ము సువిశాలము సంతతమందహాసభా
సురమును దీర్ఘనేత్రియుగశోభిత మార్యునుసేవ్యమానమై
వరలెడి నీముఖేందురుచి భావనదీపిక నాకు కానలోన్.

చ. బహు జన్మార్జిత భూరిపుణ్య ఫలసర్వస్వంబునై ఘోరదు
స్సహదుఃఖప్రవిదారకంబు విలసత్సౌఖ్యప్రదంబుల్ శుభా
వహమున్ సంతతచింతనీయమగు నీపాదాబ్జయుగ్మంబుబ్రో
త్సహమున్ ధ్యానముఁజేసి కొందుబలమున్ దక్షానలోన్నిల్వఁగన్."

చ॥ అని నృపమాళిఁయొద్ద సెలవందుచుఁ బిన్నలమందహాసరా
జని, ఘనులన్ నతిన్, సములఁ శ్రీకరదృష్టిని, గౌరవించుచున్
వనికిఁబ్రియాణమై చనె నృపాలుఁడు మంత్రికి నర్థరీతిమై
వని వనితామణిన్ విడిచివచ్చుట కాజ్ఞనొసంగి పంపఁగన్.

క. తప్పని సరిగాఁ దనపై
నప్పని భారంబుఁ బడుట కాపగసుంతే
నప్పుడు శక్యముగామికి
నప్పట్టునఁ జింతమున్గె యాసచివుండున్.

శా. కార్యోద్వేగము వారువప్రతతివేగంబుల్ గనున్ మీఱ సౌ
కర్యప్రాప్తకయోజనావళియుఁ జక్రింబట్టుదోర్లంగ, నా
గార్యోదంచిత రాణిసైపు మదియున్ దత్పట్టణాశన్ దవీ
యార్యస్తోము నహార్యధైర్యఘనదేహంబున్ జనన్ గానలోన్.

శా. నానాడున్ దనకాపకానిగతినిన్ వ్యాపారముల్ సీమనెం
తేనిన్ జిత్రముగాగ మాఱుటయుఁ గానే మార్పునున్ జేయలే
కానారీమణిఁ జేతులారగ నరణ్యంబందునన్ జేర్పగా
నానాకర్మముఁ గాంచుచున్ సచివుఁ డత్యంతవ్యథాపూర్ణుడై.

మ. యతివేషంబునఁ గోసలావనిని నేయత్నించి యెట్లెట్లో యా
సతిమార్గిల్ల యొనర్చినట్టి చెయివుల్ సర్వమ్మునున్ బైకిఁదె
చ్చితి నైనన్ దదధీశుఁ డామెఁగనఁ బిచ్చిం జెంది దేశంబువీ
డి తదారంభముగాఁ గనంబడమి నెందన్ మన్మహాశాలతల్

ఉ. "మర్మము లేని నిర్మలిన మానసమేర్పడనేని యుక్తమా
కర్మమొనర్పనేని మహికాంతుడురాణియునట్టివేళలన్
ధర్మము తప్పనట్టి మహితప్రతిభాన్వితు లేని దేవుఁడే
ధర్మముబ్రోచునేని యిటతప్పక నాకృషిపాగి తీరెడిన్."

